పెద్దల అభిప్రాయం కొఱకు

ఓం.

# వైదికసంస్కృతి - - - - కమ్యూనిజమూ





వంగల కృష్ణదత్తశర్మ

ఓం

శ్రీ శివాయ గురవే నమః

# వైదిక సంస్కృతి – కమ్యూనిజం

## 1 (లేఖ)

కామ్రేడ్స్,

నేను కమ్యూనిస్టుపార్టీ సభ్యుడుగా వుండికూడా (కమ్యూనిస్టు దృష్టిలో) హిందూమతతత్త్వవాదుల సైనికసంస్థ అయిన రాష్ట్రీయ స్వయంసేవక సంఘానికి వెళుతున్నందుకు సంజాయిషీ చెప్పుకోవలసి యున్నది. అదే యీజాబు.

"ఆసింధు సింధుపర్యన్తా యస్య భారతభూమికా
పితృభూః పుణ్యభూశ్చైవ సవై హిందు రితి స్మృతః"

సవార్కార్.

"ఒకే సంస్కృతి (కల్చర్) గల జనుల ఐక్యభావనయే రాష్ట్రం (నేషనాలిటీ)" (స్టాలిన్). భిన్న ప్రాంతీయ సంస్కృతుల వికాసమే ప్రపంచ కార్మిక సంస్కృతికే జన్మస్థానం. (స్టాలిన్). ఇక సిసలైన హిందువు కమ్యూనిస్టుగా యెందుకుండ రాదో నాకు తెలియటంలేదు. అల్పసంఖ్యాకులతో వ్యవహరించవలసిన రీతిని గూర్చిన హిందూమహాసభావాదాన్ని, స్టాలిన్ వ్రాసిన "ప్రాబ్లెం ఆఫ్ నేషనాలిటీస్" ను పోల్చి చూడగా నాకు కలిగిన అభిప్రాయాలను 'రాష్ట్రం' అనే వ్యాస రూపంగా పంపుతున్నాను.

నాలుగు యుగాలలో వరుసగా నాలుగువర్ణాలకు ప్రాధాన్యం. కనుకనే యీ కలిలో శ్రామికనియంతృత్వం.

మానవులకు "మత్తుమందైన" "మతాన్ని గురించి" "దేవుణ్ణి" గూర్చి నాకు గల అభిప్రాయాలే "కమ్యూనిస్టులకు దేవుడు లేడా?" అనే రచన. లియాంటెవ్ తన "పొలిటికల్ ఇకానమీ"లో పెట్టుబడిదారీవిధానాన్ని తన నెత్తురు తనే త్రాగి బలిసే పిశాచినిగా వర్ణించాడు. ఆ పద్ధతినే తలక్రిందు చేసి, రూపాలనుబట్టి భారతీయదేవతల (స్వభావాల) తత్త్వాలను గ్రహించడానికి నేను చేసిన ప్రయత్నమే యీ వ్యాసం. మనుష్యజాతికి కీడు కలిగించే దేవతలు లేవన్నాను.

వికేంద్రీకృతములైన గ్రామ పంచాయితీలను రాష్ట్రపు ఆర్థిక జీవనానికి పునాదులుగా నిర్మించే ప్రయత్నాలను యీ యంత్రయుగంలో కూడా భారతీయ ఫాసిజం (సంఘటన) అడ్డగించలేదు. (చూ. జపాన్ ఆర్థికవ్యవస్థ, సోవియట్, ప్రకాశం గారి గ్రామపంచాయతీ బిల్లు) దానికి గల బలమంతా వైదికసంస్కృతి అంటే యిప్పుడు గల అకారణద్వేషమే. (చూ. పరాశరస్మృతి. 1 అ)

అది ఒకేరకంగా ప్రసరించే బుద్ధే అయినా, కేవలం హృదయంలేని బుద్ధిగానే వుంటే, దృష్టిభేదంతో విరుద్ధఫలితాలకు దారితీస్తుంది. ఉ-(౧). వైదికసంస్కృతిలో సత్కార్యవాదం, అసత్కార్యవాదం. (౨) బౌద్ధసంస్కృతిలో పూర్ణవాదం, శూన్యవాదం. (3) డైలెక్టిక్స్ (ఋతవిద్య లేక పరి

గామ సత్యవేదన) లో కమ్యూనిజం (మార్క్స్), (హెగెల్) ఫాసిజం: వీలునుబట్టి కంటిఅద్దం మార్చుకుంటే సరిపోతుంది.

సిద్ధాంతాలనుగూర్చి యింతవఱకు

ఆరోగ్యానికి ఉత్సాహం, క్రమశిక్షణ గలవ్యాయామం అవసరం.

రెండూ యెఱ్ఱజెండాలే, ట్రేడ్‌యూనియన్ (వర్ణ ధర్మపు) జెండాలే.

ఇక యిప్పటి రాజకీయాలను గూర్చి

"రాష్ట్రీయ స్వయంసేవకసంఘం మతకలహాలను రెచ్చకొడుతున్నది" అన్నవాదానికి సమాధానం:—"అది సంస్థగా హిందూధర్మరక్షణను మాత్రమే చేస్తుంది. (అంటే:— ఏది లేక పోతే అది అదికాదో, అది ఆ దాన్నల్లా రక్షించుకుంటూ వుంటుంది.) అంతేకాని దానికి మఱిదేనితోనూ విరోధం లేదు" అని. బాపుజీకి గురుజీ సమాధానం యిదే. ఇంకా అవిశ్వాసం దేనికి ?—కాని యిది టెక్నికల్ సమాధానం మాత్రమే.

అయితే ఒకటి. కొందఱి మన స్తత్త్వాలు మాత్రం అందు కనుకూలంగా తయారు కావచ్చును. అయినా హిందూ సంఘటనవాదులు "శాంతిసంఘంలో చేరము" అన్నచోటు ఒక్కటైనా వున్నదా?

మతోద్రేకికి నేను (కమ్యూనిష్టు) పార్టీపాలసీ నచ్చ చెప్పే పద్ధతి ఈ క్రింది సంభాషణ.

మతోద్రేకి:—చూచారా! పంజాబు దురంతాలూ, నైజాం ఘోరాలూనూ, ముస్లింలు యెంత క్రూరులో!

నేను:—అయితే యేం చేతామంటారు?

మ:—వెళ్ళగొట్టేద్దాం.

నే:—జిన్నా కోరుతున్నది సరిగా యిదేకదా. మనం కూడా జిన్నాగారి విరోధభక్తుల మౌదామా?

మ:—కాదు. వారిని తుడిచిపెట్టి వేయాలి.

నే:—హైదరాబాదులో మొదటిసారిగా "క్విట్ హైదరాబాద్" అనగలిగిన కామ్రేడ్ మగ్దూం మొహియుద్దీన్‌వంటి వారినికూడానా?

మ: అటువంటివారితో మాకు విరోధము లేదు. కాని వారిని కూడా నమ్మరాదు. దూరంగా ఉంచవలసిందే.

నే:—నమ్మతగినవారు కానియ్యండి. నమ్మకూడనివారు కానియ్యండి. ఇప్పటికి ప్రభుత్వపతాకకు వందనంచేస్తూ, ప్రత్యేకహక్కులు కోరకుండా వుండి, అవసరమైతే నైజాముకు వ్యతిరేకంగా పోరాడుతామని హామీయిచ్చిన ముస్లిములను ద్రోహం చెయ్యదలచుకున్నా చెయ్యలేని స్థితిలోపెట్టి, మనకు రక్షణగా వుంచుకోటం తెలివా? లేక వారిని ధ్వంసంచెయ్యబోయి మనబలాన్ని కొంత

సాశనం చేసుకుని శత్రువును దండయాత్ర కాహ్వానించ టం తెలికా?

మ:—నిజమే. కాని వారు ద్రోహం చెయ్యకుండా ఆపగల కట్టు దిట్టాలు మనం చెయ్యలేము.

నే:—ఇంతమాత్రపు కట్టుదిట్టాలే చేసుకోలేనివారు ఒకరాజ్య ముతో యుద్ధమెలా చేయగలరు?

సరేగాని—"పోలీసు, కోర్టు, పన్నువసూలు, సైన్యం అనే యీ నాలుగుశాఖలు ప్రతి జమీందారుకు అప్పగిస్తాను వారు నా సామంతులయ్యేటట్లయితే" అని నైజాం ప్రభు వంటే ఆ వలలోపడని జమీందారెవడైనా వుంటాడా?

మ:—? ? ? ?

నే:—కాబట్టే మన లోపలి బలహీనతను గుర్తించి సాగించే కార్యక్రమ మేదో పెద్దమనిషి తరహాగానే సాగించటం మంచిది. రాబోయే యుద్ధం పూర్తి అయేలోపుగానే మన జీవితావసరవస్తువు లన్నీ గుత్తవ్యాపారస్థుల చేతు ల్లోకిపోయినా యనీ, వారిజుట్టు అమెరికా పెట్టుబడి దారుల చేతుల్లో చిక్కిందనీ, ఆ విధంగా మనమంతా మళ్ళా అమెరికా బానిసల మైనామనీ మీరే గ్రహిస్తారు. సెలవు.—

ఈపై విచారధారలో యేదైనా లోపంవుంటే సవ రించుకుంటాను.

కాని సంస్కృతభాషను, వైదికసంస్కృతిని గౌరవించటం, సుహ్రావర్ది వంటివాళ్ళను నమ్మలేకపోవటం, యివే పార్టీ సభ్యత్వానికి అనర్హతలైతేమాత్రం, నేను పూర్తిగా అనర్హుణ్ణి.

అలాగే కమ్యూనిజాన్ని ద్వేషించటం, మహారాజులను విశ్వసించటం, యివే రాష్ట్రీయస్వయంసేవకసంఘానికి అవసరమయితే అందులోనూ నేనుండతగను.

కాని — లోపలవున్నా సరే, బయట వున్నా సరే ఎల్లప్పుడు కమ్యూనిస్టుపార్టీకి మిత్రుడుగా వుండటమే నా ఆశయం. ఇలాగే రాష్ట్రీయస్వయంసేవకసంఘానికి కూడాను.

ఉయ్యూరు,
19—9—47.

విప్లవాభివందనాలతో
వంగల కృష్ణదత్తశర్మ



ఉపక్రమణిక:—

"స్వామ్యమాత్య, జనపద, దుర్గ, కోశ దండ,
మిత్రాః ప్రకృతయః" (కౌటిల్యుడు)

ఇవన్నీ కలసి రాజ్యం. అట్టిరాజ్యానికి స్వాభావికసీమ అయిన రాష్ట్రాన్ని గూర్చే యీ వ్యాసం.

# 2 రాష్ట్రం (నేషనాలిటీ)

రాష్ట్రానికి అయిదంగాలు. 1. దేశం (కంట్రీ) 2 జాతి (రేస్) 3. సంస్కృతి (కల్చర్) 4. మతం (రెలిజియన్) 5. భాష (లాంగ్వేజ్)

1. దేశం : జనపదమే దేశం. "దేశమంటే మట్టి కాదోయ్ దేశమంటే మనుషులోయ్", "జనస్య వర్ణాశ్రమాత్మకస్య ద్రవ్యోత్పత్తిపదం జనపదం." అంతేకాని జనానికి పదమైనదల్లా జనపదం కాదు. ద్రవ్యోత్పత్తిపదం కావాలి. ఇదే 'ఇకనామిక్ డిటెర్మినిజమ్'. జనం యెటువంటిది? వర్ణాశ్రమాత్మకం. ఎందుకు? ద్రవ్యోత్పత్తికి. వర్ణాశ్రమాలకు ద్రవ్యోత్పత్తికి సంబంధం యేమిటి? వర్ణాశ్రమాలు ద్రవ్యోత్పత్తి సౌకర్యం కొరకే పుట్టినయ్. అందులో 'వర్ణం' అంటే 'ట్రేడ్ యూనియన్' అన్నమాట. కనుకనే జనపదంలో విప్లవం వచ్చినప్పుడు ధర్మసంస్థాపనకు కమ్యూనిజం అవసరమౌతుంది. (చూ. ఇండియాపై వ్యాసాలు. By కరల్ మార్క్స్, ముగింపు)

2. జాతి : "సమానప్రసవాత్మికా జాతిః" తల్లి దండ్రుల చాలు బిడ్డలకు రానటమే జాతి. అది సంస్కారం (కల్చర్ లైప్ ఆఫ్ హార్మోన్ చైన్) వల్ల కలుగుతుంది. కమ్మ, కాపు, బ్రాహ్మణ, వ॥ కులాలన్నీ జాతులు. వర్ణాలు కావు. జాతి వర్ణాల సంకరభావమే కులతత్వం (కమ్యూనిజం)

3. సంస్కృతి ; ప్రాణవాయువులోని తేజఃప్రసర ణమే మనస్సు. ఆ తేజస్సు ఒకే లక్ష్యం వైపుకు కొంత సేపటి వఱకు ప్రసరిస్తూ వుండటమే తపస్సు. వ్యక్తి 12 యేళ్ళు, జాతి 7 తరాలు అలా తపస్సు చేస్తే 'సంస్కారం' (కల్చర్) కలుగు తుంది. అది కలిగించేటందుకే శ్రుతి స్మృతి పురాణ ఇతి హాసాలు.

—నియన్‌ట్యూబు లాంపుకు, నియన్ = ప్రాణం ఎలెక్ట్రిక్ = మనస్సు వున్నాయి. దానికే అహంకారాన్ని, సం స్కారాన్ని యివ్వగలిగితే సృష్టికి ప్రతిసృష్టియై అది శాంతిని స్థాపిస్తుంది.

4. మతం : ప్రవక్త (ప్రాఫెట్), ప్రమాణగ్రంథం (బుక్), మఠం (చర్చి), దర్శనం (ఫిలాసఫీ), స్మృతి (ఎథిక్స్), పురాణం (మిథాలజీ) యివన్నీకలది మతం (రిలిజియన్). భార తీయ సంస్కృతిలోని మతాలన్నిటికీ ప్రమాణగ్రంథాలు మాత్రం, ప్రాయశః ప్రస్థానత్రయానికి భాష్యప్రాయాలుగా వుంటయ్. వుండాలి. ఇక్కడ మతస్వాతంత్ర్యానికి యెన్నడూ భంగం కలుగలేదు. ఆ మతాలు తమ వ్యాప్తికై దౌర్జన్యాన్ని

ప్రయోగించనంతవరకు. కనుకనే అన్వయవ్యతిరేకాలు రెంటికీ కూడా ఉదా :- షణ్మతస్థాపనాచార్యులు శ్రీ శంకరభగవత్పాదులు. అలాగే యిప్పటి మహమ్మదీయ క్రైస్తవమతాలూను. ఉదా:-రామకృష్ణ పరమహంస. (ఈయన మహమ్మదీయ-క్రైస్తవ సాధనలలోకూడా సిద్ధిపొందారు). ప్రతిరాజ్యానికీ ఒకమతం తప్పకుండా ఉంటూ ఉంటుంది. ఉదా:-రష్యా మతం కమ్యూనిజం.

అయితే, మతము సంస్కృతి భేదించినప్పుడు, దేశం ఆ దేశప్రజాతికే చెందుతుంది. తక్కినవారికి యేది కావాలంటే అది విడిపోయే హక్కుతో సహా యిస్తాం. ఎందుకంటే-పొరుగువాడిమేలే మనమేలు, వాడి కీడే మనకీడూ కనుక. కాని యిచ్చేది మనమే. కనుకనే యు. యస్. యస్. ఆర్. లో కూడా రష్యనే రాజభాష. ఇదం బ్రాహ్మం-ది థీరీ ఆఫ్ సెల్ఫ డిటెర్మినేషన్. కాని, యే పరాయిజాతైనా దాన్ని దుర్వినియోగం చేస్తేమాత్రం అట్టిజాతిని సర్వనాశనం చేస్తాం. ఇదం క్షాత్రం.

బ్రాహ్మానికి ఉదాహరణలు. ఫ్రాన్స్ చెకోస్లోవేకియన్-టర్కోమన్ సోషలిస్టు రిపబ్లికులు.

క్షాత్రానికి ఉదాహరణలు. 1 హిట్లరు మాస్కోదగ్గరకు వచ్చినప్పటి ఓల్గా జర్మన్ రిపబ్లిక్, 2. ఫిన్లండు 3. మాసైర్కొహాయాంలోని పోలండు. 4. ఈస్టుప్రష్యా 5. సుడెటన్ లాండ్.

ఇదంబ్రాహ్మం ఇదంక్షాత్రం. బ్రహ్మవర్చస్సు, క్షాత్ర తేజస్సు కలిస్తేనే దేశానికి శాంతి, స్వాతంత్ర్యం, అభ్యుదయం.

5. భాష : ప్రాకృతభాషలు యెనిమిది. వాటిని భారతీయసంస్కృతికి అనుగుణంగా సంస్కరిస్తే ఛాయ సంస్కృతం అయింది. ఆ ప్రాకృతభాషల వికృతులే తెనుగు వ॥ దేశభాషలు. ఆర్థికభిన్నత్వమే భాషలను భేదింపచేస్తుంది. కాని కలిపేది సంస్కృతి. [అందుకనే భష్పన్న దేశాలు వున్నప్పటికీ, హిందూసంస్కృతికి హిందూస్థాన్, ముస్లిం సంస్కృతికి పాకిస్థాన్. జిన్నా రిఫరెండానికి ఒప్పుకోకపోతే కమ్యూనిస్టులు 'రైటు' అన్నదీ యిందుకే. ఇప్పుడు హిందూసంఘటనవాదులు కూడా రిఫరెండానికి అంగీకరించం అంటే తప్పనటం యెలా?].

# 3. కమ్యూనిస్టులకు దేవుడు లేడా?

## (ఒకటవ భాగం)

అవును, లేడు.

కాశీలో చస్తే కైలాసం వస్తుం దని అక్కడకు చేరిన దిక్కులేని డబ్బుగల ముసలమ్మలను చంపటమే వృత్తిగా పెట్టుకున్న పండాలను యేజెంట్లుగా పెట్టుకుని అలా చస్తున్న ముసలమ్మల చెవులలో తారకమంత్రాన్ని ఉపదేశించే శివుడు లేడు.

శివరాత్రి అభిషేకపునీరు, పైబడ్డ కుక్కకు కైలాస మిచ్చే శివుడు లేడు.

వైష్ణవుల ఉత్సవవిగ్రహాన్ని చూస్తే ప్రాయశ్చిత్తం చేయించుకునే శివుడు లేడు.

లింగరూపుడైన శివుడు లేడు.

కుమారీపూజలు, మకారపంచకసేవ లేనిదే దర్శన మివ్వని భగవతి లేదు. గ్రామదేవతలు లేరు.

యకరానికి పాతికరూపాయలు శిస్తు తీసుకుని ఆడబ్బుతో భోగంఆటలు చూస్తూ కులికే వడ్డికాసులవాడు లేడు.

అజామీళుడికి వైకుంఠం ప్రసాదించే నారాయణుడు లేడు.

తనతో రాసక్రీడలుసలిపే గోపికలకు మాత్రమే వైకుంఠ మిచ్చే వల్లభమహారాజ్‌లను యేజెంట్లుగా నియమించుకున్న కృష్ణుడు లేడు.

రూపాయి ముడుపు కట్టనిదే నివాళి చేపట్టని విష్ణువు లేడు. ముడుపు కట్టినా హరిజనుల నివాళి చేపట్టని విష్ణువు లేడు.

స్మార్తుల ముఖంచూస్తే పాపమని ప్రచారం చేయించు కునే విష్ణువు లేడు.

బంగారంచేపట్టి అన్నిపాపాలను మాఫీచేసే భూదేవత లను యేజెంట్లుగా నియమించుకుని, మిథ్యాప్రపంచానికి అతీ తుడు, అవాఙ్మానసగోచరుడు అయిన పరమాత్మ లేడు.

మన చర్యలన్నిటిని మన ప్రమేయం లేకుండా ముందే తన యిచ్ఛద్వారా నిశ్చయించి, ఫలితాన్ని మాత్రం మనకర్మ ప్రకారం ప్రసాదించే భగవంతుడు లేడు.

ఒంటికి వెన్నపూసుకుని, భార్యచేత నిప్పులో నెయ్యి పోయించే భర్తకు రంభను తార్చిపెట్టే యజ్ఞేశ్వరుడు లేడు.

పీడితప్రజకు "మీరు నిష్కామకర్మ చేస్తూవుండండి. మరోజన్మలో మీకు మంచిఫలితం కలుగుతుంది" అని బోధించే శ్రీకృష్ణపరమాత్మ లేడు.

అలాచేయకపోతే కలిగే నరకానికి అధిపతి యమధర్మరాజు లేడు.

"పాపోహం......రక్ష రక్ష మహేశ్వర" అనే భక్తుడిని "మన్మనా భవ......మాశుచః" అని ఓదార్చే భగవంతుడు లేడు.

"యదహ్నాత్ కురుతే పాపం.....ప్రతిముచ్యతే" అని రోజూ సంధ్యావందనం చేసినంతమాత్రాన, యెప్పటిపాపం అప్పుడు మాఫీచేసే కర్మసాక్షి లేడు.

గంజాయి పొగలో మాత్రమే దర్శనమిచ్చే అచలపరిపూర్ణుడు లేడు.

"జగం మిథ్యా, పలాయనం మిథ్యా" అంటూ వస్తున్నారనానే, చెంబూ తప్పాలా జాగ్రత చేసుకోవాలన్న భావాన్ని ప్రజలలో కలిగించిన వేదాంతుల బుఱ్ఱలలోని అద్వైతపరమాత్మ లేడు.

# ౩. కమ్యూనిస్టులకు దేవుడు లేడా?

## (రెండవ భాగం)

కాని దైవం వున్నది.

గుణాన్ని కర్మ (పరిమాణం) గానూ, కర్మను గుణం గానూ మార్చే సృష్టికర్త విప్లవబ్రహ్మ ఉన్నాడు. కనుకనే అతనికి పూజానర్హత.

భౌతిక విప్లవానికి నాంది భావవిప్లవం. అది కలిగించే చదువుల సరస్వతి కవిబ్రహ్మజిహ్వామీద నృత్యం చేస్తూనేవుంది.

ఉనికి లేక ద్రవ్యం (మాటర్)కు మరో పేరై ప్రపంచానికి ఆధారభూతమైన స్థాణువు ఉన్నది.

లయకారకమై వియోగరూపమై వర్గకలహానికి ఆదియైన రౌద్రం ఉన్నది.

ప్రపంచరూపిణియైన పరాశక్తి, పరమాణుశక్తి ఉన్నది.
లయకాలరూపిణి కాళి ఉన్నది.

కులభేదాలను కూలద్రోయటానికి విశ్వప్రయత్నంచేసిన వీరశైవం ఉన్నది. దానికి అఙ్గం (పనిముట్టు) లిఙ్గం (గుర్తులేక శక్తి బిందువైనద్రవ్యం, జఙ్గం (జంగమం లేక పనివాడు) యివన్నీ ఉన్నయ్.

సంయోగరూపమై ప్రపంచస్థితికి కారకమైన వైష్ణవం

ప్రపంచంలో జనులందరూ తనవారని భావిస్తూ కాపాడుకున్న ప్రేమ (కోఆపరేషన్) రూపమైన సంకర్షణుడున్నాడు.

అప్లైడ్ సైన్స్ రూపంగావుండి సకలసంపదలను ప్రసాదించే లక్ష్మి ఉన్నది.

ఈ లక్ష్మీనారాయణుల సంయోగంవల్ల భూలోకంలోనే ఉద్భవించే వైకుంఠం ఉన్నది.

భక్తిపారవశ్యంతో కులభేదాలను కూలద్రోయటానికి విశ్వప్రయత్నంచేసి, ప్రచారకపద్ధతులలో సిద్ధహస్తమై బ్రహ్మనాయుడు, ఉన్నవవంటి మహాపురుషులను తెలుగునాటికి ప్రసాదించిన వీరవైష్ణవం ఉన్నది.

సచ్చిదానందస్వరూపమై నామరూపాత్మకమైనప్రపంచమంతటా నిండియున్న పరమాత్మ ఉన్నది.

పనికితగిన ఫలితాన్ని తప్పకయిచ్చే కర్మసాక్షి ధర్మదేవత ఉన్నది.

మనకు వేడిని, వెలుగునూ యిస్తూ, ప్రపంచంలోని సకలగుణ పరిణామాలకు కారణమైన ప్రత్యక్షదైవం అగ్ని ఉన్నది.

ఆ అగ్ని సాయంతో మనం నిర్మించుకోగల భూలోక స్వర్గం ఉన్నది.

యోగం (టెక్నిక్) అంటే :—"కర్మసు కౌశలం" అది యజ్ఞానికి సాధనం. యజ్ఞం అంటే :—దేవతలూ, మానవులూ పరస్పర శ్రేయస్సుకొరకు, వారు వీరుగా, వీరు వారుగా భావించుకోటం." అని బోధించిన యీశ్వరవాణి ఉన్నది.

"త్యాగే నైకే అమృతత్వ మానశుః" అని ఆత్మయజ్ఞం చేయగల సాహసులకు సకలం ప్రసాదించే అపూర్వం ఉన్నది.

అవకాశవాదుల్ని అణచటానికీ కర్మవీరులలో త్యాగ శక్తిని ప్రేరేపించటానికీ అవసరమైన నిష్కామకర్మ ఉన్నది.

జమీందారులు, దొంగమార్కెటుదారులు మిలిటరీ తత్త్వపువారు చేసే పాపాలఫలితంగా ప్రపంచప్రజ అంతా అనుభవించే భూలోకనరకం ఉన్నది. దాన్ని సృష్టించిన పాపానికి తగిన శిక్షను వారికి విధించే యమ (ప్రజా) శక్తి ఉన్నది.

చేసిన తప్పును బహిరంగంగా అంగీకరించి దిద్దుకునే ఉదాత్తత గల ధీరులను సర్వనాశనంకాకుండా కాపాడే భగవచ్ఛక్తి ఉన్నది.

"నీధర్మంలో నీవు చచ్చిపో. పరధర్మానికి ప్రాకులాడకు. అది మహాభయంకరం సుమా!" అని సంఘస్థైర్యం కలిగించిన యీశ్వరవాణి ఉన్నది.

గుణత్రయ — దైవాసురసంపద్విభాగయోగాలు, మానవసంఘాన్ని అర్థం చేసుకునేందుకై ప్రపంచంలోకల్లా మొట్టమొదట తయారయిన ఆంతర (హృదయ) వివరణే (సైకియాలజీ).

చెట్లుపచ్చగా వుంటున్నై, నెత్తురు వెచ్చగావుంటున్నది, భూములు పండుతున్నై, బుద్ధులు పనిచేస్తున్నయ్ అంటే వీటన్నింటికీ కారణం ప్రత్యక్షంగా కనబడుతున్న సూర్యబింబం ఉండనే ఉన్నది.

స్వభావం — . "మన్మనాభవ ... మాశుచః."

అష్టాంగయోగసాధనద్వారా విజ్ఞానాన్ని వ్యాపింప చేసి, కులభేదాలను అంతరింపచేయటంలో కొంతవరకైనా సఫలులై, మనోనిరోధంవల్ల మృత్యుంజయులైన అచల పరిపూర్ణు లున్నారు.

మన మనస్సులలోని ప్రపంచపు వివర్తాలకూ ప్రతి బింబాలకూ, వాటి భిన్నరూపాలైన భావాలకూ యీ దృశ్య ప్రపంచాన్ని మార్చేశక్తి ఉన్నది.

కమ్యూనిస్టులకు దేవుడున్నాడా? లేదా?

---

P. S :—యీ అభిప్రాయాలు కలిగివున్నందుకే నేను పార్టీనుండి నిష్కాసితుడ నైనాను. 21-9-47.

